శ్రీ గురుభ్యోనమః

శ్రీ శారదాంబాయైనమః

# రసభావనాయకాసాంప్రదాయము

ఇది

శ్రీ పుల్లేపు వేంకటసుబ్బరాయమంత్రి ద్వితీయపుత్రుండగు

నాగభూషణకవి విరచితంబై

వారి ప్రియశిష్యుండగు

మాగంటి లక్ష్మణదాసుగారి

ద్రవ్యసహాయమువలన

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి

శ్రీమనోరమాముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1911

దీని వెల 6 అణాలు.

# రసభావనాయకాసాంప్రదాయము.

రసప్రకరణము.

రస మనగా ఉప్పు, పులుసు, కారము, చింతపండు, బెల్లము, నెయ్యి, పెరుగు, మొదలైన వ్యంజనపదార్థములయొక్క కలియకచే నన్నమునకు రస మెట్లుగలుగుచున్నదో అట్లే విభావాదిభావములయొక్క, కలియకచే, రసికులయొక్క హృదయమునకు రసముకలుగు చున్నది. ఇది 9 విధములు.

1 శృంగార రసము.

2 వీర రసము.

3 కరుణా రసము.

4 అద్భుత రసము.

5 హాస్య రసము.

6 భయానక రసము.

7 భీభత్స రసము.

8 రౌద్రరసము.

9 శాంతరసము.

1 శృంగార రస మనగా విభావాదిభావములచే సదస్య స్వాద్యత్వము ను బొందిన రతి స్థాయీభావము. ఇది, నాయకీ నాయకాలంబములగు యౌవనము. 2 రూపము 3 లావణ్యము. 4 సౌందర్యము. 5 అభిరూప్యము. 6 మార్దవము 7 సౌకుమార్యము మొదలగువానిచేతను వస్త్రములు భూషణములు, మాల్యములు, లేపనములు, నను చతుర్విధాలంకృతులచేతను, శుక పిక స్వరములు, మధుకర ధ్వనులు, సంగీ

తము, చంద్రోదయము, మలయమారుతము. భూబిలము, పర్వత క్రీడ, జలక్రీడ, కుసుమాపచయము, తాంబూలము, వనవిహారము, హార్మ్యవిహారము, డోలాయంత్రము, లతామంటపము, మాకందము, దర్పణము. తల్పము, స్త్రీముఖావలోకనము, మొదలగు తటస్థములచే తను, ఉశ్వాసనిశ్వాసలు, విర్హాపాండిమము, కటాక్షములు, భ్రూవిక్షేపములు, సల్లాపము, హాసము, ఓష్టచలనము, మొదలగువానిచేతను క్రీడలగు, దశవిధచుంబనములు, అష్టవిధాలింగనములు, దంతక్షత నఖక్షతములు, చౌసీతి బంధనములచేతను, దశవిధావస్థలచేతను, గలుచున్నది.

ఇది 2 విధములు.

1 విప్రలంభ శృంగారరసము.

2 సంభోగ శృంగార రసము.

విప్రలంభ శంగార రసలక్షణము.

విప్రలంభ శృంగార రసమనగా, అనుపమాన ప్రేమానురాగము గలిగియున్న, నాయకీనాయకులకు పరస్పరకారణములచే కలియుక లేక పోవుట. ఇది యైదువిధములు.

1 అయోగ విప్రలంభము.

2 విరహ విప్రలంభము.

3 మాన విప్రలంభము.

4 ప్రవాస విప్రలంభము.

5 శాప విప్రలంభము.

1 అయోగ విప్రలంభ మనగా, నాయకీ నాయకులకు ప్రథమ సమాగమము నకు ముందు గలిగిన విప్రలంభమే. (ఇందు నాయకు నవలోకించి యింటిలోని కరుగుట వెలపలకువచ్చుట, నిక్షేతుకముగ నా

యకుని యెదుట నిలువంబడుట. తన యభిప్రాయమును వ్యంగ్యములు గ ప్రకటనము చేయుట, నిర్జన స్థలమందు నొంటరిగ నిలువంబడుట, చి లునగవుతో మాటాడుట మొదలైనవి గలుగును.)

2 విరహ విప్రలంభ మనగా ఒకేయూరిలో నుండెడు నాయకీ నాయకులకు ప్రేమ గలిగియుండినను పరస్పరకారణములచేత యాలస్యమైనచో నందుమీాద గలుగుపరితాపము. ఇందు చింత, ఉత్సాహము, ఉశ్వాసనిశ్వాసలు, దశావస్థలు గలుగును.

3 మాన విప్రలంభ మనగా, నాయకీ నాయికాజ్ఞోల్లంఘనముచేత గాని పరస్త్రీసంభోగచిహ్నములు చూచుటచేతగాని కలుగుకోపముచే కలియక లేకపోవుట (ఇందు మాటలాడకపోవుట మోముప్రక్రకుత్రిప్పుట కొట్టుట తిట్టుట యేడ్చుట బెదరించుట మొదలైనవి గలుగును.)

4 ప్రవాస విప్రలంభ మనగా, నాయకీ నాయకులలో నెవ్వరేనియు పరదేశవాసులైనప్పుడు యొకరిపై నొకరికి గలుగు చింత. ఇందు చిక్కిపోవుట యేడ్చుట తెల్లబోవుట నిట్టూర్పులు దీనత్వము యీ మొదలైనవి గలుగును.

5 శాప విప్రలంభ మనగా నాయకీనాయకులు స్వగ్రామములో నుండినను పరగ్రామములో నుండినను యొకరియం దొకరికి మొగమాటముతప్పి శాపములు బెట్టుకొనుటచే కలియక లేకపోవుట (ఇందు దుఃఖము నిట్టూర్పు యాసలేకపోవుట తలపంకించుట మొదలైనవి గలుగును.

సంభోగ శృంగార రసలక్షణము.

సంభోగ శృంగారరస మనగా నాయకీనాయికల కితరాటంకము లేవియు లేక యిచ్చవచ్చినట్లు నిత్యమును నఖక్షత దంతక్షత చుంబనాలింగన బంధనాదులతో మదనకేళికావిలాసము లనుభవించునట

ఇది 2 విధములు.

1 సంక్షిప్తము

2 సంపన్నము

1 సంక్షిప్త సంభోగ శృంగారరస మనగా ఉపచారములయొక్క సహాయముచేత కామేచ్ఛ గలిగి సంభోగించునది.

2 సంపన్న సంభోగ శృంగారరస మనగా యేవిధమైన యుపచారములు లేకయే ముఖావలోకనమున గలుగుకామేచ్ఛచే సంభోగించినది

వీర రసలక్షణము.

వీరరస మనగా విభావాది భావములచే సదస్యాస్వాద్యత్వమును బొందిన యుత్సాహ స్థాయిభావము ఇది 3 విధములు

1 యుద్ధ వీరము.

2 దయా వీరము.

3 దాన వీరము.

1 యుద్ధ వీరమనగా మన్మథ యుద్ధమందుగాని మరేయుద్ధమందుగాని సిద్ధపడుచు అందుకు తగినసాధనాయుధములు సంగ్రహించుట.

2 దయా వీరమనగా, ఆపత్కాలమందు తన్నుప్రార్థించినవానిని రక్షించెదనని శపథంబులువల్కుచు యభయహస్తంబిచ్చుట.

3 దానవీరమనగా, చిఱునగవుగలిగి కడకంటి చూపులతో చేయవలసినదానముకంటె యెక్కువదానము చేయుట.

3 కరుణారసలక్షణం

కరుణారస మనగా, విభావాదిభావములచే సదస్యాస్వాద్యత్వమును పొందిన శోకస్థాయిభావమున ఇది తనద్రవ్యమునుదొంగలుదోచుకొనుటచేతను, బంధువులుగాని స్నేహితులుగాని చచ్చుటచేతను దరిద్రముచేతను పదభ్రమిశముచేతను అవమానముచేతను ఫలాభావముచేతను

గలుగును. ఇందు వెంట్రుకలు వస్త్రములు చెదరిపోవుట తల ముఖము రొమ్ము కొట్టుకొనుట యేడ్చుట నేలపైబడుట మొదలైనవికలుగును.

4 అద్భుతరసలక్షణం

అద్భుత రస మనగా విభావాదిభావములచే సదస్యస ద్వ్యక్త్వమును బొందిన విస్మయస్థాయీభావము ఇది యెన్నడును చూడనివస్తువులు చూచుట మనుష్యవశముగాని మహాకార్యములు చూచుట మాయా విచారణచేయుట చిత్రపట్టణములు చూచుట యింద్రజాలములు చూచుట నృత్యము చూచుటమొదలైనవానిచే గలుగును. ఇందు ముఖము వికసించుట రెప్పవేయక చూచుట తలపంకించుట దేహము తెలియకుండుట మొదలైనవి గలుగును.

5 హాస్యరసలక్షణము.

హాస్యరస మనగా విభావాదిభావములచేత సభ్యులకు రసగ్రహణము గలుగజేయు హాసస్థాయీభావము. ఇది వేదములు శాస్త్రములు విద్యలు పురాణములు ఇతిహాసములు దేశభాషలు మృగములు పక్షులు మనుష్యులు వాద్యయంత్రములు మొదలగు వాని స్వరములను తనస్వరమునం దనుస్వరింప చేయుటచేతను కులము బలము విద్య సౌందర్యము ధనము ఉద్యోగము యౌవనము కీర్తి మొదలగువానిమదము చేతను ధీరత్వము డంబత్వము పౌఢత్వము మొదలగువానిచేతను గలుగును. ఇందు వెక్కిరించుట.అసందర్భవచనములు తిట్లు ముక్కు పెదవి మోము చెక్కిళ్ళు మొదలగువానిని విరుచుకొనుట మొదలైనవి గలుగును ఇవి 6 విధములు.

1 స్మితము.

2 హసితము.

3 విహసితము.

4 ఉపహాసితము.

5 అపహాసితము.

6 అతిహాసితము.

1 స్మితమనగా కన్నులకును, మొగమునకును, చెక్కిళ్ళకును, పెదవికిని యించుకంత చలనము కిలిగియు కలుగనట్లుండునది.

2 హసితమనగా. ఆకన్నులను. ముక్కును. చెక్కిళ్లను పెదవులను దంతములను మరింత ప్రకాశముగ వికసింపజేయుట.

3 విహాసితమనగా. వంచినచూపులును. తెరచిన పెదవులును. విచ్చినదంతములును. యించుక ధ్వనియుగలది.

4 ఉపహాసితమనగా. చాచబడిననాలుకయు. తెరువబడినముక్కులును. యధికధ్వనియుగలది.

5 అపహాసితమనగా. పెద్దధ్వనిగలదియు నీరుగారుచున్న కన్నులు కదలుచున్న మెడయుగలది.

6 అతిహాసితమనిగా. అనేకవికారధ్వనులను చెదరినవెండ్రుకలు ఒడలెరుగని పోర్లాటయు, రొమ్ముమోదుకొనుటయుగలది.

6 రౌద్రరసలక్షణములు.

రౌద్రరసమనగా. విభావాదిభావములచే సభ్యులకు రసగ్రహణము గలుగచేయు క్రోధస్థాయీభావము. (ఇదిఅవమానముపాపము అధర్మము. ఆక్షేపణ మొదలైనవానిచే గలుగును. ఇందుకన్నులెఱ్ఱనౌట పళ్లుకొరుకుట. పెదవి కరచుట. ఆయుధములుపూనుట. భుజములు నొడలు చఱచుకొనుట. నడుము బిగించుట. మీసముదువ్వుట మొదలైనవి గలుగును.

7 భయానకరస లక్షణము

భయానకరసమనగా. విభావాదిభావములచేత రసికులకురస గ్ర

హణములు గలుగజేయు. భయస్థాయీభావము. (ఇదిరాక్షసులు. దయ్యము పాములు. తేళ్లు. పెద్దపులులు. ఎలుగుగొడ్లు. అడవులు. చీకట్లు మనుష్యులులేనిచోటు. శ్మశానము. దొంగ. ఆయుధములు. ముండ్ల మంటలు. ఏరులు మొదలైనవాటిని చూచుటచే గలుగును.

(ఇందు మోము. పెదవిచెక్కిళ్లు మొదలగు సర్వాంగములు వణకుట. ఇటునటు పారిపోవుట. చేతులు పిసికికొనుట. మొదలైనవి గలుగును.

8 భీభత్సరసలక్షణములు.

భీభత్సరసమనగా. విభావాదిభావములచేత సభ్యులహృదయమునకు రసగ్రహణము కలుగజేయు,జిగుప్సా స్థాయీభావము (ఇదిరక్తము. మాంసము. ఎముకలు. వాంతి. చొంగ కుళ్లినవస్తువులు. మలమూత్రములు వికారరోగములుగల మనుష్యులను చూచుటచే గలుగును.)ఇందు మోము త్రిప్పుట. ఉమియుట. పెదవి విరచుట గలుగును.

9 శాంతరసలక్షణములు.

శాంతరసమనగా. అకళంకమైనదిగనుక రసికులీరసమును స్వజ్ఞాన విశేషంబుచే నెఱుంగునది.

1వదగు రసప్రకరణము ముగిసె

భావప్రకరణము.

భావమనగా. ఏవికారమును లేకయుండు పరిశుద్ధాంతఃకరణము(ఇది 5 విధములు.)

| | |
|---|---|
| 1 విభావము. | 2విధములు. |
| 2 అనుభావము. | 4విధములు. |
| 3 సాత్వికభావము. | 8విధములు. |
| 4 సంచారిభావము. | 33విధములు |
| 5 స్థాయీభావము | 8విధములు |

అందు

1 విభావమనగా. రత్యాదిస్థాయీభావములు దేనిచేభావింపబడుచున్నవో, అదివిభావము (ఇదిరెండువిధములు)

1 ఆలంబన విభావము.

2 ఉద్దీపన విభావము.

అలంబనవిభావమనగా. నాయకీనాయకులఆలంబన గుణవిశేషణములు ఇవి 7విధములు

1 యౌవనము.

2 రూపము.

3 లావణ్యము.

4 సౌందర్యము.

5 అభిరూప్యము.

6 మార్దవము.

7 సౌకుమార్యము.

యౌవనమనగా. నాయకీనాయకులకు. కాలక్రమమున నభివృద్ధినొందు పాయము. ఇవి3 విధములు.

1 ప్రథమయౌవనము.

2 ద్వితీయయౌవనము.

3 తృతీయయౌవనము.

ప్రథమయౌవనమనగా. సర్వాంగములయొక్క యాకారము పూర్ణముగ యేర్పడక, మొలకచన్నులును మెఱుపు, తెలుపురంగుగల పెదవులును, మన్మథలీలావిలాసములచే ప్రకాశింపుచున్నముఖపంకజమును, నిగనిగమెఱయుచుండు మేనును. చంచలమైనచూపును.గలది.

1 ద్వితీయయౌవనమనగా. నిండింపబడిన యంగములుగలదిగా

ను. బలిసి నిక్కినచన్నులును, సన్ననినడుమును, యెఱ్ఱబారిన పెదవు లును, యేనుగుతొండములవంటి తొడలును, మదపువాసనయు, నొయ్యారపు నడకలునుగలది.

3 తృతీయయౌవనమనగా. తెల్లబారిన కన్నులును, నల్లబారిన పెదవులును, వాడినచెక్కిళ్లును, చిక్కినదేహమును, తగ్గినహెచ్చరిక యుగలది.

2 రూపమనగా. అంగములకు దగినయాభరణము లలంకరింప బడకయే నలంకరించిన ట్లుప్రకాశించుట.

3 లావణ్యమనగా. ముత్యములపైనుండు నిగనిగలు శరీరమందు ప్రకాశించుట.

4 సౌందర్యమనగా. అంగ ప్రత్యంగోపాంగములయొక్క చక్కని సంధిబంధసన్నివేశము.

5 అభిరూప్యమనగా. ఆత్మీయగుణాతిశయముచేత తనచెంగట నుండు పదార్థములు సారూప్యము జేసికొనుట

6 మార్దవమనగా. దేహమంటబడియు నంటబడకుండునట్టి మృదుత్వముగలది.

7 సౌకుమార్యమనగా. కోమలపదార్థములయొక్క స్పర్శనైన సహింపజాలని శరీరముగలది. (ఇదిత్రివిధములు.

1 ఉత్తమసుకుమారము. పుష్పాదుల స్పర్శనైన సహించనది

2 మధ్యమ సుకుమారము. కరస్పర్శనైన సహించనిది.

3 అధమసుకుమారము. ఎండ చలి ఉక్క వాన మొదలైనవానిని సహించనిది.

ఆలంబములుముగిసె.

ఉద్దీపన విభావమనగా నాయకీనాయకుల
మన్మథోద్దీపనోత్కర్ష (ఇదిరెవిధములు)

1 గుణములు.

2 చేష్టలు.

3 అలంకృతులు

4 తటస్థములు

5 అవస్థలు.

1. గుణములనఁగా.—సంతోషము, కోపము, లజ్జ, భయము చింత, మొదలైనవి.

2. చేష్టలనఁగా.—నిట్టూర్పులు, విర్హాపాండిమము, కడకంటి చూపులు, ఒయ్యారపునడకలు, నవ్వులమాటలు, ఒడలుచెక్కిళ్ళువిరుచుట, మొదలైనవి.

3. అలంకృతులనఁగా.—వస్త్రములు, పుష్పములు, మాల్యములు, లేపనములు.

4. తటస్థములనఁగా.—శుకపికస్వరములు, మధుకరధ్వనులు, సంగీతము, చంద్రోదయము, మలయమారుతము, భూబిలము, పర్వతక్రీడ, జలక్రీడ, కుసుమాపచయము, తాంబూలము, వనవిహారము, హర్మ్యవిహారము, డోలాయంత్రము లతామంటపము, మాకందము. దర్పణతల్పములు, స్త్రీముఖావలోకనము, మొదలైనవి.

5. అవస్థలనఁగా.—మదనవికారగణనము. (ఇది10విధములు)

1. చక్షుప్రీతి—మనోహరుని కన్నులతోఁజూచుకొనుప్రీతి.

2. చింత—కార్యసాధన మాలోచించుట.

3. సంకల్పము—నాయకుఁడు గనఁబడనిచో గల్గుయూహము,

4. గుణనుతి—యతనిగుణాతిశయములను వర్ణించుట.

5. క్రియాద్వేషము-యతనిపైయాసచే నన్నికార్యములు వదలుట.
6. తాపము-ప్రియుఁడురామిచే గలుగు జ్వరతొందర.
7. లజ్జాత్యాగము-సిగ్గువదలుట.
8. ఉన్మాదము-ఒకవస్తువు మరియొక వస్తువుగా దోచుట.
9. మూర్ఛ-జ్ఞానము నశించి క్రిందఁబడుట.
10. మృతి-యందుచేగలుగుచావు.

అనుభావలక్షణము.

అనుభావమనఁగా.—భావములన్నిఁటిని యేది స్ఫురణకుదెచ్చు చున్నదో యది అనుభావము. (ఇది 4 విధములు.)

1. చిత్తజానుభావము-10 విధములు.
2. గాత్రజానుభావము-10 విధములు.
3. వాగారంభానుభావము-12 విధములు.
4. బుద్ధ్యారంభానుభావము-3 విధములు.

అందు చిత్తజానుభావములు 10 విధములు.

1. భావము-నిర్వికారమయిన మనస్సు.
2. హావము-భావముకన్నులందుగలుగుట.
3. హేల-దానిని యించుకం తభినయించుట.
4. శోభ-దానిని యలంకారములతో నభినయించుట.
5. కాంతి-దానిని మన్మథవిషయంబుగచూపుట.
6. దీప్తి-దానిని భోగములయం దుపయోగించుట.
7. ప్రాగల్భ్యము-ప్రయోగములందు నిస్సంశయవృత్తి.
8. మాధుర్యము-వ్యాపారములుమృదువుగాచేయుట.
9. ధైర్యము-నిర్భయముగనుండుట.
10. ఔదార్యము-సర్వకాలము లందును నుదారత్వంబుగ నుండుట

## గాత్రజానుభావము. 10 విధములు.

1. లీల—ముద్దుమాటలు.
2. విలాసము—వగవద్దికలు గల యంగవిన్యాసములు.
3. విచ్ఛిత్తి—అలంకారములకుతగిన చక్కదనము.
4. విభ్రమము—ఒకవస్తువును మరియొక వస్తువుగా తలచుట.
5. కిలికించితము—సంతోషము, భయము, సిగ్గు, చింత, వీనికూడిక.
6. మోట్టాయితము—స్వాభిలాషా ప్రకటనము.
7. కుట్టమితము—లోపల సంతోష ముండినను పైకి దుఃఖము:ను చూపుట.
8. బిబ్బోకము—ఇష్టవస్తువులందే నయిష్టము గలుగుట.
9. లలితము—సుకుమారాంగవిన్యాసము.
10. విహృతము—అడిగినప్రశ్నలకుక్రియలచే ప్రత్యుత్తరములిచ్చుట.

## వాగారంభానుభావము. 12 విధములు.

1. ఆలాపము—సంతోషపు మాటలు.
2. విలాపము—దుఃఖపు మాటలు.
3. సల్లాపము—ప్రశ్నోత్తరవులుగలమాటలు
4. ప్రలాపము—పనికిమాలినమాటలు.
5. అనులాపము—చెప్పినమాటనే మరలచెప్పుట.
6. అపలాపము—ముందుచెప్పినమాటను వెనుక త్రిప్పివేయుట.
7. సందేశము—స్నేహితునితో చెప్పుకొనుమాటలు.
8. అతిదేశము—ఒకరు చెప్పిన మాటలోనే క్రమముగచెప్పుట.
9. నిర్దేశము—నిరూపణముచేసిచెప్పుట.
10. అపదేశము—అర్థాంతరమును తెలియచేయుట.
11. ఉపదేశము—శిష్యులకు గురువుచెప్పెడిమాటలు.
12. వ్యపదేశము—ఇతరవ్యాజముగచెప్పుమాటలు.

బుద్ధ్యారంభానుభావము. 3 విధములు.

1. రీతి } ఇయ్యది కావ్యపాదితంబులుగాన కావ్యమును చూ
2. వృత్తి } డతగినది.
3. ప్రవృత్తి }

సాత్వికభావమనగా:—పరుల యొక్క కష్టసుఖములయం దెవని మన సనుకూల మగుచున్నదో అదిసత్వమనఁబడును. ఇది 8 విధములు.

1 స్తంభము—నిష్క్రియాంగత్వము
2 స్వేదము—చెమట
3 రోమాంచ వము—గగుర్పాటు
4 స్వరభేదము—డగ్గుత్తుక
5 వేపదు—తొందర
6 వైవర్ణ్యము—ముఖ తేజస్సుమారుట.
7 అశ్రు—కన్నీరు
8 ప్రళయము—ప్రజ్ఞనశించుట

(4) సంచారీభావము 33 విధములు

1 నిర్వేదము-దరిద్రసంకట వియోగములచే గలుగు ఫలాభావము
2 గ్లాని—సురతరోగ వ్యాయామంబులచే గలుగు దౌర్బల్యము
3 శంక—పరోక్షా పరోక్షములచే నిత్యానిత్యములు విచారించుట
4 అసూయ—పరులసంపదచూచి యసహ్యపడుట
5 మదము—సోమహిపాదులచే గలుగు యానందసమ్మోహము
6 శ్రమము-నృత్యగమన క్రీడాదులచే గలుగు యలసట
7 ఆలస్యము—నిర్భయతృప్తి గర్వంబులచే గలుగు కాలవిడంబన
8 దైన్యము—యనేక కారణములచే గలుగు దీనత్వము

9 చింత-ఇష్టవస్తువులు లభింపమిచే గలుగువిచారము

10 మోహము-ఆపద్భయ వియోగంబులచే మనసున కేమియు తోచమి.

11 ధృతి-గురుశాస్త్రాదిత్య బోధలచే గలుగు చిత్తశుద్ధి

12 స్మృతి-యదార్థ పూర్వానుభూతార్థ జ్ఞానము

13 వ్రీడ-యవమానసూతన సంగమాదులచే గలుగు చింత

14 చపలత-రాగద్వేషములచే గలుగు చిత్తచలనము.

15 హర్షము-ఇష్టసిద్ధిచే గలుగు సంతోషము

16 ఆవేగము-పశుగజశకటాగ్ని వర్షాదులచే గలుగుతొందర

17 జడత-విషయాదులచే గలుగుయజ్ఞానము

18 గర్వము-అష్టైశ్వర్యములచే గలుగు యహంభావత్వము

19 విషాదము-ప్రయత్న భంగముచే గలుగుయనుతాపము.

20 ఔత్సుక్యము-విరహాదులచే తాళలేమి

21 నిద్ర-మందస్వభావముచేగలుగు చిత్తనిమీలనము

22 అపస్మారము-వాతపిత్తశ్లేష్మాదులచే చెడిన మనస్సు

23 సుప్తి-నిద్రయొక్క-యాధిక్యము

24 విబోధము-నిద్రవిడిచి మేల్కొనుట

25 ఆమర్షము-అవమానాదులచే గలుగుక్రోధము

26 అవహిత్థ-అపరాధము చేయుటచే గలుగు యాకారగుప్తి

27 ఉగ్రత-క్రోధముచే గలుగు పరుషవాక్యములు

28 మతి-అనేక శాస్త్రములచే చేయబడిన యర్థనిర్ణయము

29 వ్యాధి-విరహాదులచే గలుగు కామజ్వరము

30 ఉన్మాదము-ఇష్టనాశముచే గలుగు చిత్తవిభ్రమము

31 మరణము—ధనుంజయ వాయువచే గలుగు నిర్గమము
32 త్రాసము—అసురపిశాచ సర్పాదులను చూచుటచే గలుగు భయము
33 వితర్కము—సత్యాసత్య విచారణ

(5) స్థాయీభావము 8 విధములు

1 రతి—నాయకీనాయక లన్యోన్యమైన కలియక
2 ఉత్సాహము—సంతోషముచేత చేయువ్యాపారము
3 శోకము—పుత్రమిత్రకళత్రధన నాశాదులచే గలుగుచింత
4 విస్మయము—లోకోత్తర పదార్థములను చూచుటచేగలుగువింత
5 హాసము—శబ్దరూపవికారములచే గలుగు నవ్వు
6 భయము—భయంకర పదార్థములను చూచుటచేగలుగు వెరగు
7 జిగుప్స—అయోగ్యవస్తువులను చూచుటచే గలుగు నసహ్యము
8 క్రోధము—అవమానములచే గలుగు కోపము

2 వ దగు భావప్రకరణము ముగిసె.

## నాయకాప్రకరణము.

### నాయకా లక్షణము.

1 నాయకనఁగా:— రసాలంబసాధార భూతులగు నాయకీనాయకులు

అందు

ప్రసిద్ధ నాయకలు 3 విధములు

1 స్వీయ—3విధములు
2 పరకీయ—2విధములు
3 సామాన్య—3విధములు

## స్వీయాలక్షణము.

1 స్వీయయనఁగా:—వేదశాస్త్రోక్తముగ వివాహము చేసికొనబడి పతియొక్క భాగ్యాభాగ్యములను కష్టసుఖములను సమానముగ నెంచి సర్వకాల సర్వావస్థలయందును పతియందే భక్తియుంచి కులశీలధర్మంబులతో వర్తించు స్త్రీరత్నము.

ఈమె 3 విధములు

1 ముగ్ధ-నూతనయౌవనియై రతి వ్యాపారములందు సిగ్గుగలది

2 మధ్య-నిండుచున్న యౌవనముగలదై నాయకునపేక్షించునది.

3 ప్రగల్భ-నిండినయౌవనముచే మదించినదై మదనపాండిత్యముచే నాయకుని వశీకరము చేసికొనునది.

## 2 పరకీయలక్షణము

పరకీయయనఁగా:—వేదశాస్త్రోక్తముగవివాహము చేసికొనినభర్తయుండగా నన్యపురుష సంభోగము చేయునది,

ఈమె 2 విధములు

1 కన్య

2 ప్రౌఢ

1 కన్యయనఁగా:—అంకురితయౌవనియైపోషకులయధీనములోనుండి సిగ్గుగలిగి కొంతబయలుపడిన జారవ్యాపారముగలది.

2 ప్రౌఢయనఁగా:—యత్తవారింట కార్యములు చక్కబెట్టుకొని పెనిమిటికి నమ్మకమైన నడతలుచూపించి యాతనియానంద పరచి పిమ్మట పరపురుషునితో నెవరికి తెలియకుండ రహస్యముగ జారవ్యాపారము చేయునది యీమె 9 విధములు.

1 గుప్త-జారసురతమును గోపనముచేయునది.

2 విదగ్ధ-తనరహస్యము జారునికితప్ప యితరులకు చెప్పనిది

3 లక్షిత—కొంత తెలియబడిన జారవ్యాపారము గలది.

4 కులట—యనేక పురుషులపై యనురాగముగలది.

5 అనుశయాన—సంకేత సందర్భమును విచారించునది.

6 ముదిత—సమయము దొరకెనని జారుని పిలువనంపునది.

7 సాహసిక—పతి చూచుచుండగనే యన్యపురుష సంభోగము చేయునది.

8 ప్రతిభాచతుర—రంకు బయలుపడినను బొంకుతో తప్పించుకొనునది.

9 అపలాపచతుర—పతికడనేడ్చి ఒట్లుపెట్టుకొని నమ్మించునది.

(3) సామాన్యలక్షణం.

సామాన్యయనఁగా—సంగీతసాహిత్యసరసాభినయ విద్యాధురీణయై సభ్యులకు రసప్రదర్శనము కలుగజేయుటయేగాక తన్నాశ్రయించిన నాయకుఁడు కుంటివాఁడైనను గ్రుడ్డివాఁడైనను మగతనము లేనివాఁడైనను, రోగపీడితుఁడైనను ముసలివాఁడైనను బాలుఁడైనను తు దకెట్టివాఁడైనను కేవలధనాగమంబునకై వానిచెంగటజేరి యత్యంతా నురాగంబున మదనసామ్రాజ్య వైభవంబుల నుభవింపజేసి యెట్టకే లకుయాతనివలన ధనాగమంబు సూన్యంబైనచో నిర్భాగ్యమోటముగ యింటనుండి వెడలగొట్టునది. (ఇది3 విధములు)

1 జాతిసామాన్య

2 ఆగంతుకసామాన్య

3 గూఢసామాన్య

1 జాతిసామాన్యయనఁగా:—సహజవేశ్యాంగనకు జన్మించి స్వగృహమునకు నాయకుని రప్పించుకొనునది.

2 ఆగంతుక సామాన్యయనఁగా:—పరజాతియందు జన్మించి వేశ్యవలన క్రయమునకు తీసికొనబడి సామాన్యవృత్తిచే ధనమార్జించునది.

3. గూఢ మాన్యయనఁగా— కేవల వేశ్యాప్రృతిక యైనప్పటికిని నాయకుని యింటియందు వాసముచేయుచు యాతనివలన ధన మార్జించునది.

శృంగారనాయికలు 8 విధములు.

1. స్వాధీనపతిక.
2. వాసకసజ్జిక.
3. విరహోత్కంఠిత.
4. విప్రలబ్ధ.
5. ఖండిత.
6. కలహాంతరిత.
7. ప్రోషితభర్తృక.
8. అభిసారిక.

1. స్వాధీనపతికయనఁగా—పతికి నెల్లప్పుడులోఁబడియుండునది

2. వాసకసజ్జిక యనఁగా—నాయకుఁడు వచ్చు సమయముకు తా నలంకరించుకొని పడకగది నలంకరించుకొని శయ్యాసనాదులను సిద్ధపరచుకొని గృహకృత్యములు నెరవేర్చుకొని యాతని రాకకై యెదురు చూచునది.

3. విరహోత్కంఠిత యనఁగా—ఏయొక్క యపరాధము గావించి యెరిగియుండని నాయకుడు సంకేతసమయమునకు రాక జాగు సేయగ కాలవిళంబన కోర్వలేక పరితాపఁబడునది.

4. విప్రలబ్ధ యనఁగా—తొల్లి తాము నియమించుకొనిన సంకేతస్థలమునకు నాయకుఁడు రాక పరిభవింపఁబడి, మన్మథునిచేత పీడ పెట్టఁబడునది.

5. ఖండిత యనఁగా—సంకేతసమయము నతిక్రమించి పరస్త్రీ సంభోగచిహ్నములతో వచ్చిన నాయకుని చూచి కోపించునది.

6. కలహాంతరిత యనఁగా—తనకు వశీకృతుఁడైన నాయకుని సఖిచేటుల యెదుట తృణీకరించి యవ్వల చింతించునది.

7. ప్రోషితభర్తృక యనఁగా—పరదేశమునకు పోయియుండి న నాయకునికొరకు చింతించునది.

8. అభిసారిక యనఁగా—నాయకుఁడున్న సంకేతస్థలమునకు తానే వెడలునది.

సహాయనాయికలు 12 విధములు.

సహాయనాయిక లనఁగా పైనచెప్పిన నాయికలకు సహాయపడుచుండువారు.

1. దూతి–నాయకీ నాయకులమధ్య రాయబారము చేయునది.
2. దాసి–గృహకృత్యములు నెరవేర్చునది.
3. చేటి–నాయకీనాయకులకు సంధానము చేయునది.
4. సఖి–సమప్రాయముగల స్నేహితురాలు.
5. ధాత్రేయి–దాది కూఁతురు.
6. ప్రాతివేసిని–యిరుగుపొరుగులందు కాపురముచేయు స్త్రీ.
7. లింగిని–నాయకీనాయకుల గుట్టు తెలిసికొని ద్రవ్య మార్జించునది
8. శిల్పిని–శయ్యాసనాదులు సిద్ధపరచునది.
9. సైరంధ్రి–చతుర్విధాలంకారములును చక్కబెట్టునది.
10. శిక్షక–అన్యోన్యబోధ చేయునది.
11. పరిహాసిక–నాయకీనాయకుల లోపములుచూచి వెక్కిరించునది
12. నర్మసఖి–నాయకీనాయకుల యిద్దరిరహస్యము నిస్సంశయముగ్గ తెలియచేయుటకు తగినది(అనఁగానమ్మకము గలది.)

ప్రసిద్ధనాయకులు 3 విధములు.

1. పతి–వేదశాస్త్రోక్తముగ వివాహము చేసికొనిన పురుషుఁడు.
2. ఉపపతి–వేదశాస్త్రోక్తముగ వివాహము చేసికొనిన స్త్రీని పొందు పరపురుషుఁడు.
3. వైశికపతి–వేశ్య నుంచుకొనినవాఁడు.

శృంగారనాయకులు 4 విధములు.

1. అనుకూలుఁడు—అనఁగా స్వస్త్రీ దర్శనస్పర్శనాదులయం

దెంతమాత్రము యిష్టములేక స్వస్త్రీయందే తన యౌవనమును వినియోగపరచుచు యామెకు లోబడియుండువాఁడు.

2. దక్షుఁడు— అనఁగా తన్నాశ్రయించిన యనేకమంది స్త్రీలను తన ప్రౌఢత్వముచే సమముగా నేలువాఁడు.

3. దృష్టుఁడు— అనఁగా తన నిజాపరాధమును నాయిక గ్రహించి తన్ను వెడలగొట్టినను విడువక నాపెనే ప్రార్థన నమస్కారాదులచే నాశ్రయించువాఁడు.

4. శఠుఁడు— అనఁగాతనపై ప్రీతిగల నాయికపై తనకు ప్రీతియున్నట్లు నటించుచు గూఢముగ ప్రియును జరుపువాఁడు.

సహాయనాయకులు 4 విధములు.

1. పీఠమర్దుఁడు—కొంచె మించుమించు నాయకునితో సమానుఁడు.
2. విటుఁడు—కామకళాశాస్త్రములయందు నిపుణుఁడు.
3. చేటుఁడు—నాయికానాయులకు మైత్రి గలుపువాఁడు.
4. విదూషకుఁడు—నాయకీనాయకుల లోపంబులు కనిపెట్టి అంగవికారములతోను, స్వరవికారములతోను పరిహసించువాఁడు.

మహానాయకులు 4 విధములు.

1. ధీరోధాత్తుఁడు—ధైర్యాది సద్గుణములు గలిగి రతికళా కామశాస్త్రవేత్తయగువాఁడు.
2. ధీరోద్ధతుఁడు—ధైర్యాది సద్గుణములు గలిగి కామశాస్త్రవేత్తయై సర్వభోగము లనుభవించుచుండువాఁడు.
3. ధీరశాంతుఁడు—ధైర్యాది సద్గుణములు గలిగి కామశాస్త్రవేత్తయైసర్వభోగము లనుభవించినవాఁడు.
4. ధీరలలితుఁడు—ధైర్యాది సద్గుణములు గలిగి రతిశాస్త్రవేత్తయై సర్వభోగము లనుభవించుచు ననుభవింపబోవువాఁడు.

నాయకాప్రకరణము ముగిసె.

